ఓమ్

శ్రీ మహాగణాధిపతయేనమః

# సాధ్వీనటన శతపద్యరత్నావళి







ఇది

కొమరిపాలెము వాస్తవ్యులగు

దేవాదుల ధర్మారావుగారిచే

రచియింపఁబడినది.

మొదటికూర్పు 1000 ప్రతులు

రామవరమున

మల్లిడి సత్తిరెడ్డిగారి

శ్రీ శుకీముద్రాక్షరశాలయందు ముద్రితము.

1940

 [ వెల రు 0-4-0

## —:కృతి సమర్పణము:—

సీ. ఏమహామహు నీవి యెలమియర్థులపాలి
  కల్పభూజం బన గణుతిఁగనెనో?
ఏమహామహు వాక్యమెన్నఁడుః ఋ సంఘంబు
  నుల్లంఘనము జేసి యుండలేదో?
ఏమహామహుఁడిల విషయభోగములన్ని
  త్యాగించి సంసార త్యాగిఁగాఁడో?
ఏమహామహుఁడు త న్నిర్యాణకాలంబు
  ధృవపరచెనో? యద్భు తంబుఁదోప

గీ. అట్టి సత్యవాక్య ధురంధ రామల సుగు
ణ గణ వైరాగ్యభూషిత న్రమ ధీరు
వీరయాచార్య వర్య, మ ద్విహిత పిత్రు
కర్పణముఁజేతు నీకృతి యమరవంద్య!

### —:సరస్వతీ ప్రార్థన:—

కం. వాణీ! షట్పద సన్నిభ
  వేణీ! నవరత్నఖచిత వీణాంచిత సత్
పాణీ! పద్మజు ముద్దుల
  రాణీ! నను బ్రోవుమమ్మ రాజితవేణీ!

ఓమ్

శ్రీమదాదివిరాట్పతయేనమః

# సాధ్వీనటన శత పద్యరత్నావళి



కం. శ్రీగౌరీ సత్యాపతో
భోగంబుల నంద దగిన బుద్ధులుఁ గలుగన్
ఆగమ రీతిని శతకము
లో గందములన్ వెలయఁ బలుకుదు సాధ్వీ! 1

కం. పసితనము నాట నుండియు
మసలవలయు సిగ్గుగల్గి మగువల కది యిం
పొసగుం గౌరవమిడును సు
వాసన యబ్బిన కనకము పగిది సుసాధ్వీ! 2

కం. పలుకకు మసత్య మెన్నడుఁ
బలికిన నది దాఁగఁబోక బాములు వెట్టున్
యిలఁ గాకికి పసరద్దిన
చిలుక యగునె? నెఱుకలెల్ల చెడక సుసాధ్వీ! 3

కం. తరుణీమణిఁ గలుషంబులు
వరుఁ బాద సపర్యవలన బాయును, పాలన్
దరచిన నవనీత మనిలు
గరగింపగ నిరు వెడలుఁ గరణిని సాధ్వీ! 4

కం. చెడు గుణము నీకుఁ గల్గిన
పడతీ! నినుఁగన్న వారి పరువెల్లఁ జెడున్
గడవం గొంచము లవణము
బడినంత నె క్షీర మిరుగ బడునటు సాధ్వీ! 5

కం. పతి నెడఁబాయంగ, నధో
గతిఁ బాలగుదీవు, యెంత గా నెదిగున్నన్
లత, తరువుఁబాసి, యెట్టుల
బ్రాకినఁ బెంపు లేకఁ జెడునటు సాధ్వీ! 6

కం. మామకు, న త్తకు నీవయి
ప్రేమ వలయునన్న సేవ మెలగగ వలయున్
భూమిని ఫలితము నొందెదు
కామి, బురదచేత పిసుక గావలె సాధ్వీ! 7

కం. తరుణీ! నీ జీవంబులు
వరు పాదార్చనను, నిలువ బడి యుండుఁజుమీ
ధరలో సిరము చేతను
వరిసస్యముఁ బండ నేర్పు ఫక్కిని సాధ్వీ! 8

కం. పతి దా విత్తము దెచ్చిన
మతిఁబొంగకు, లేకయున్న బాధ వడకుమీ
క్షితిపయి చంద్రుడు రాహువు
గతమై, మఱి శోభ వెలయు గల్గునుసాధ్వీ! 9

కం. ఎదురాడకు నీనాథుడు
పదపడి, నీపైన గినుకఁ బడినను తుదకున్
మది గుంకు నతడె మఱియును
సదయుండయి మొసగుమిగుల సౌఖ్యముసాధ్వీ!

కం. పతి భుక్తపు శేషము దిను
సతి కిలలో స్వర్గసుఖము సమకూరుఁ జుమీ
క్షితి నమృత మది యనుదురు వ
నితలకు బుధవర్యులదియ నిక్కముసాధ్వీ! 11

కం. వినయము గలిగి మెలంగిన
ఘనత వడుదు వీవు సర్వ కార్యము లందున్
వినయముచే గజవదనుడు
గణనాధుం డయ్యె,శివునిఁ గరుణను సాధ్వ!12

కం. గొంతెత్తి మాటలాడకు
యింతులతోఁ జెల్మిఁ జేసి యిలువీడకు, యే
పొంతల నిలువకు, నీయశ
మంతయునశియించు పాపి వగుదువుసాధ్వ! 13

కం. వెఱువుము యత్తకు, మామకు
వెఱువుము బావ,మఱదులకు వెఱువుము పతికిన్
గఱుతుగఁ బెద్దలఁ గాంచినఁ
గరమునఁబూజింపుఁ గీర్తి గలుగునుసాధ్వ!14

కం. ఉరువడిఁ దన మూడవ కను
గరళగ్రీవుండుఁ దెఱువఁ గల్గినఁ గాని
చెరువఁ బని లేదు, పతి నిజ
చరణంబులఁ బూజసతము సలుపగసాధ్వ! 15

కం. వ్రతములలోఁ నుత్తమ మగు
వ్రతముఁ బతివ్రతముఁ గలుగ । పరవ్రతములకై
మతి దలపఁబోవ కెన్నడు
పతియే నీదైవ మమ్మ । వసుధను సాధ్వీ! 16

కం. భక్తిని రాళ్లకు మ్రొక్కిన
శక్తిని తీర్థాటనములు । సల్పినఁగానీ
రక్తిని భజనలుఁ జేసిన
ముక్తికి ధవు పాదసేవ । ముఖ్యముసాధ్వీ! 17

కం. కారణము లేక నవ్విన,
కారణమున నవ్వఁ బండ్లుఁ । గనబడ వెలికిన్
నార్యులు గడువడి భువిలో
నారసి దుశ్చరితయనుచు । నందురు సాధ్వీ! 18

కం. పంతమున నీమనోహరు
డింతీ! పోవలవ దెచట । కెన్నం డన్నన్
నెంతటి పని గల్గిన, నొ
'క్కింతయు నిలు గదలఁబోవ । కెన్నడుసాధ్వీ! 19

కం. గుడువకుమి పతికి ముందుగ
యడుగకుమీ? లేని నగల § యతివలతోడన్
నుడువకుమీ? పతి గుణములు
కడు చేటగు కాపురంబుఁ § గ్రాలును సాధ్వీ! 20

కం. పగటిని నిదురింపకుమీ
మగటిమిఁ జూపంగఁ బోకుఁ § ప్రాణేశునితోఁ
బగతురఁ జెల్మినిఁ గోరకుఁ
దగ నివి వీడంగ నీవు § ధన్యవు సాధ్వీ! 21

కం. ఉదయంబె శయ్య విడచియు
సదమలమతిఁ బ్రాణనాథు § సత్పాదములన్
ముదమున భక్తిని మ్రొక్కియు
తదుపరి కృత్యములఁ గడగ § దగునో సాధ్వీ! 22

కం. పలువుర వనితల మధ్యను
నిలచి బలుకఁబోకు మెట్టి § నిప్పచ్చమృషల్
గలుగుసుమీ! వైరంబులు
నిలువదు నీయింటిఁగీర్తి § నిజముగ సాధ్వీ! 23

కం. వలువలు జీరాడగ ధర
ఘలుఘలు మని కాలిమెట్టె కల్వరమొందన్
పలువిధరీతులఁ గ్రుల్లిన
వెలయాలిని బోల్త్రు నిన్ను విబుధులు సాధ్వీ!24

కం. బావల మఱఁదుల సన్నిధి
నీవెన్నడు లజ్జవిడచి నిలచి వచింపన్
బోవకు మెచ్చుటనుయుచను
నీవారలుఁ గుచుపకుండ నిలువకు సాధ్వీ! 25

కం. వలువలు నొడలును గృహమును
సలలితముగ మాసియున్న చక్కని సిరితోఁ
దులదూగు వనితకయినను
బలుదారిద్ర్యంబుగల్గు వసుధను సాధ్వీ! 25

కం. పెద్దలఁ గాంచిన యప్పుడు
గద్దెలపై నుండఁబోకఁ గను వినయముతోఁ
హద్దుగ మసలుముఁ గానిచో
మొద్దుగ నిన్నెంతురమ్మ భువినోసాధ్వీ! 27

కం. పతి దక్క నితర పురుషులు
సతివ లనెడి భావ మీవు యుండిన నాడే
యతులితముగ నీ నామము
మతిమంతులనుతుల గొనును మాన్యత సాధ్వీ! 28

కం. సిరియును సంపద నీదగు
పరివర్తనతోడ నిలువఁ బహు నీధరలో
నరయుగ గోడలపై నిలు
బరగెడుగతిఁ గాన చెడుగు మానుము సాధ్వీ! 29

కం. నిలచిన నడచిన నొరులతోఁ
బలికిన శయనించియున్న బహుకష్టములన్
యలసిన సిరులన్బడసిన
యిలరోయకు భర్త భక్తి నెన్నుము సాధ్వీ! 30

కం. యుడుగుము ఘనములు బలుకుట
నుడువకు నీ సల్పు మేలు నుగ్రతతోడన్
బడఁబోవకు దీనులపయి
పుడమినియదిదోషమండ్రుఁ బూర్వులు సాధ్వీ! 31

కం. ధవు డేపద్ధతి మెలగిన
యవుగాక యటంచు నీవు నదియే విధి ము
న్నవలంబించుచు నడచిన
గవయువుఁ గష్టములు కీర్తిఁ గల్గును సాధ్వీ! 32

కం. పను లొనరించెడు వేళను
విను దాసీ కాంతవలెను వినయముతోడన్
ఘనమగు యోచనదెల్పన
వని మాత్రివగుచు సుఖమునవర్తిలు సాధ్వీ! 33

కం. అరయగ యోర్పున ధారుణి
మరు కేళిని సల్పునపుడు మసుతను రంభా
గరిమతో, భోజన మిచ్చెడు
తరి తల్లివలెను మెలగుటఁ దగునో సాధ్వీ! 34

కం. తన కన్నము లేకున్నను
బెను దీనతఁ బొందునట్టిఁ బేదల కరయన్
గనికరమునఁ భుక్తి నిడిన
ఘనతయు మోక్షమును శిరియు గల్గును సాధ్వీ!35

కం. అతివా! యమ్ముఁడు దైనను
పతియార్తిని దీర్చునట్టి । పడతినె ధాత్రిన్
పతివ్రత యన దగు నందురు
మతియందున చంద్రమతిని । మఱువకు సాధ్వీ!36

కం. ఇరవుగ నిళ్ళను లక్ష్మి
గురు శుక్రవారములయందుఁ । గూడును గానన్
గరిమను నలికియు ముగ్గిడి
యురుభక్తిని మెలగవలయు । నువిదలు సాధ్వీ!37

కం. గసరకు చిన్నల, పెద్దల
విసువకుఁ, బనియెంతయున్న । వినుమా! పతికిన్
రోసరోసఁ జూపకు, నెప్పుడు
నోసటం గుంకుమ ధరించు । నొప్పుగ సాధ్వీ! 38

కం. పతి నిప్పచ్చర మున్నను
గతిలేకను విపినమందుఁ । గాపుర మున్నన్
యితరుల సేవలఁ జిక్కిన
పతిపీడగ గాదు సతికి । భావ్యము సాధ్వీ! 39

కం. సుదతీ! ధవు చిత్తము గని
మదవతివై దిరుగకుండ మానుగ పతికిన్
యొదవెడుఁ గష్టముఁ దీరుప
యెదయందునదలచుచుండుమెప్పుడున్ సాధ్వీ! 40

కం. మతి చంచల మవనీయక
పతి భావము గుర్తుబట్టి బహు జాగ్రతతోన్
సతిఁ బరిచర్యలు ధవునకు
నతిగాసలుపంగవలయు ననయముసాధ్వీ! 41

కం. పెద్దలలో, చిరుతలలో
ముద్దుగ నిముఁబెంచు నట్టి ముఖ్యులమధ్యన్
యొద్దిక సోదరులందున
దద్దయు మన్ననమెలంగ దగునో సాధ్వీ! 42

కం. అడకువ యొప్పిన మహిలోఁ
దడఁబడకను లచ్చి వచ్చుఁ దానే యటకున్
వడఁబడి బంధులు వత్తురు
తడయక యీనీతివినుట, సధర్మముసాధ్వీ! 43

కం. పెద్దల యర్చన సల్పుచుఁ
దద్దయు సుద్దులుఁదెలిపెడు ॥ ధర్మవిద్భక్తిన్
నొద్దిక సేవించిన ధర
నద్దిగదా పద్మినంద్రు ॥ నార్యులు సాధ్వీ! 44

కం. విత్త విహీనుండైనను
బొత్తిగ దుర్జనుడు యయినఁ ॥ బాలతీ! పతిదా
పొత్తున వేశ్యను నిల్పిన
సత్తుగ నీవేలు పంచు ॥ సాకుము సాధ్వీ! 45

కం. సీత, యరుంధతి యాదిగ
నాతులు యేరీతి పతిని ॥ నమ్మిచుఁ బర మే
చేతలఁబట్టి సుఖించిరో?
నాతీరుల దలపు మదిని ॥ ననయము సాధ్వీ! 46

కం. అత్తింట నెట్టి బాధలు
సత్తుగఁ గలిగున్న వాసి ॥ చనువున యెప్పుడున్
యెత్తకుఁ బుట్టింట మిగుల
గత్తరియగు కాపురంబుఁ ॥ గడువడి సాధ్వీ! 47

కం. గడు నిడుములుఁ బడవచ్చును
యడవుల గడ చరుగవచ్చు నర్థులుఁ దారై
వడివిడవచ్చుఁ బ్రాణము
చెడి మెలగుటకన్న లేదు చెలువో సాధ్వీ! 48

కం. పని లేకనుఁ గూర్చుండకు
మనమున పతినామ జపము మానకు మెపుడున్
వినబోవకు దుశ్చరితము
గనబోవకు నవ్యవకులఁ గనులను సాధ్వీ! 49

కం. ఎదుటను బెద్దలు యుండెడు
యదనున నెత్తయిన గద్దె లధిగోష్ఠింపన్
ముదమొంద దలచ కెన్నడు
అది నీయశమునకు మిగుల హానగు సాధ్వీ! 50

కం. నీయిలు కార్యంబులలో
నేమొదలనుఁ బరుఁ దోడు కీక్షింపకుమీ
కాయము వంచి చరింపిన
చేయుగనౌ నెద్దియయిన శీఘ్రమె సాధ్వీ! 51

కం. పతిపయి పూర్తిగ లక్ష్యము
మతినుంచుముఁగీర్తివడయు మార్గముగనుమా!
అతిభక్తితోడ గొలువుము
సతతము నీయింట బెద్ద సదయుల సాధ్వీ! 52

కం. ఏసమయంబున భర్తతో
యేసరణిని మాటలాడ నెసగుదొ? మది సం
తస మాతని కది యెఱిగిన
రసయుక్తవు నీవు వచన రచనకు సాధ్వీ! 53

కం. ధర నేఁబాపమునైనను
దరుమును పతినామజపము తద్దయుసలుపఁ
వరునింద యఘము దునుమగ
కరకంఠునికైన యలవిఁ గాదో సాధ్వీ! 54

కం. సంసారము కడు జాగ్రత
హింసే ప్రతిపూటకోచు నీక్షించిన, నే
యంశము విడచినను, గృహా
స్త్రాంశమునకు లోటుగల్గునరయుముసాధ్వీ! 55

కం. ధరణిని శాస్త్రము లెన్నిటి
నరసిన నిజ ధర్మనికన్న ¶ నగ్రత వేల్పుల్
దొరకరుఁ గావున సతతము
వరునే సేవించుమమ్మ ¶ వాంఛను సాధ్వీ! 56

కం. కూతురు నీచతఁ జెందిన
మాతది దోషంబుయంచు ¶ బల్కుదురరయన్
భూతలమందున యాగుణ
మేతరినిన్ జేరకుండ ¶ మెలగుము సాధ్వీ! 57

కం. చరణ నఖముల న్నరయుచు
కరిపోలిక నడువవలయుఁ ¶ గానీ యువిదల్
వరుసగ దిశలన్ గాంచుచు
ధరణనురగ నడచుచుంట ¶ దగదిల సాధ్వీ! 58

కం. ప్రకటకు పాపడఁదీయగ
నక్కజ మిసుమంత రాదు ¶ నరయగ దానన్
నిక్కపు పతివర్తన గల
దిక్కోమలి యనగబడవు ¶ నెన్నడు సాధ్వీ! 59

కం. కట్టును జుట్టును బొట్టు
మెట్టిదో? నీవర్తనంబు యేర్పడఁ జెప్పన్
అట్టిదో చెడువేషంబుల
బట్టిన నీగౌరవంబు పాడగు సాధ్వీ! 60

కం. అతివల యఘమున్ బాపగ
పతినామ స్మరణకన్న పథియిక యేదీ?
శ్రుతిసమ్మత మదిఁ గావున
పతినిన్యర్చించవలయు భక్తితో సాధ్వీ! 61

కం. పవనము సత్తువ నగ్నికి
జవ మరయగ నీరమంద్రు జలచరములకున్
భువనేశుడు బీదల కగు
అవనిలో పతి సతికిబలము యగునోసాధ్వీ!62

కం. దేవుని నమ్మిన జనులకు
గావలసిన యీప్సితములుఁ గల్గినయటులన్
భావమునన్ ధవు నమ్మిన
నీవలసిన సిరులు గల్గు నిక్కము సాధ్వీ! 63

కం. ఇలలోఁ గీర్తినిఁ బొందఁగఁ
గలుగును బహు కష్టదశలు గానీ, చెడ్డన్
గలదనిపించుకొనంగను
సులువుగ నొకలిప్తఁ జాలుఁ జూడుము! సాధ్వీ! 64

కం. దేవుఁడు భక్తుల కొదవెను
నేవిధ కష్టములనైన నెపుడున్ దయతో
రావని బ్రోచెడురీతిగ
ధవుడే నిన్ గాచువాఁడు ధాత్రిని సాధ్వీ! 65

కం. నల్పును బాపగ జ్యోతియు
అల్పులలేమిన్ దునుమగ నాహా! కృషియున్
దెల్పగ పతి చింతకు సతి
సల్పెడు శుశ్రూష లిడును సౌఖ్యముసాధ్వీ!

కం. పురుషులు దేవునిసన్నిధి
గరువము బోనాడి యెటులఁ గడు దీనతతో
బరువడి మ్రొక్కుచు నుందురో
ఆరీతిగఁ బతినిఁ గొల్వు మమ్మా సాధ్వీ! 67

కం. ఛందము దెలియని కవితము
పొందుగ శిక్షలఁ బెఱుగని ఁ పొలతిమణియుఁ
గుందక బిక్షము కేగుట
నందముగా నింద కిరవు ఁ లగునో సాధ్వీ! 68

కం. ఎంత ధనంబు గడించిన
కాంతా! చెడుగైతివేని ఁ కలకాలంబుఁ
చింతయెఁ దల్లికి తండ్రికి
వంతయె నీబాంధవులకు ఁ వసుధను సాధ్వీ! 69

కం. పతివ్రత లుండెడు నిలయము
క్షితి కాశీ యాది పుణ్య ఁ క్షేత్రము సాటా
అతిగాఁ జెప్పుట యేలను
శతవిధముల లక్ష్మి జేరు ఁ సత్యము సాధ్వీ! 60

కం. తన యవయవములఁ గాంచుచు
మినుముట్టగ నెగురుచుండు ఁ మిండల ధాత్రిఁ
గని దండధరుడు వారిని
అనయము దండించు నరక ఁ మందున సాధ్వీ! 71

కం. ధన లోభము చేత భువిని
వనితా! యపకీర్తితోడ వర్తిలు కన్నన్
ఘనమగు బండను గట్టుకఁ
గనుమూసుకఁబడుట మేలుఁగ గంగలొ సాధ్వీ! 72

కం. కంబువు గెల్చెడు గళమని
కుంభాదుల మించు మేటి కుచములటంచున్
రంభా స్తంభము తొడలని
సంబరమున యొడలు మఱచి సాగకు సాధ్వీ! 73

కం. నడివయసునందుఁ గులుకుచు
వడిగా విటవరులతోడ వర్తించిన చో
బడితతోఁ గాలుఁడు తత్పురి
మడియించును వంశకీర్తి మాయును సాధ్వీ! 74

కం. నీతుల నెఱిగియు దోసము
భూతలమునఁ జేయుఁదగదు పుణ్యాంగనకున్
మతి నెఱిఁగి సలుపు పాపము
వెతలెన్నియొ గూర్చునంద్రు విబుధులు సాధ్వీ! 75

కం. పతికి న్మ్రొక్కవ నీపై
నతిగా గలిగున్నదంచు । నందఱి యింటన్
హితముగఁ గొలువక యుంటచె
పతనము నీకబ్బు సిరులు । పాడగు సాధ్వీ! 76

కం. గరువముఁ గల్గిన నిలలో
దరుగును ధనధాన్య రాసి । తనుపరి బంధుల్
కూరిమిఁ జూపరు మునువలె
దొరకొని నీకీర్తిఁబోవుఁ । దోడనె సాధ్వీ! 77

కం. వదలక కష్టమొ సౌఖ్యమొ?
ముదమున పతితోడఁబొందు । ముగుదన్ ధాత్రిన్
సుదతీ చూడామణి యని
బుధులందురు తానుఁబొందు । పూజ్యత సాధ్వీ!78

కం. కామాది తుచ్ఛసుఖముల
నేమానిని రోసి మదిని । యెపుడున్ భక్తిన్
వేమరు పతి సేవించునో?
యామానిని కిహము పరము । లబ్బును సాధ్వీ!79

కం. పిల్లలు పసితనముంగాన
తల్లులచేఁ దెలియవలయుఁ దగు నడవడికల్
అల్లరికృత్యము లొల్లక
కొల్లలుగాఁ జెప్పు ధర్మ గుణములు సాధ్వీ! 80

కం. వినుమా! ప్రేమచె సుతులను
అనయము పొరుగిండ్ల చెంత కరుగఁగనీకఁ
పని లేకను నూరూర్లకు
జననీయకు చెడ్డలగుచు జనుగురు సాధ్వీ! 81

కం. నేర్పుము సద్గుణ సంపద
నేర్వఁగఁ జేయించు నీకు నెలతా! సంతుఁ
నుర్విని సద్గతు లిచ్చెడి
తెర్వులుయివి యంద్రుబుధులుఁ దెలియుము సాధ్వీ!82

కం. పెంచకు లాలన బాలుర
నెంచకు పరవరులమదిని యెపుడయినా, యా
చించకు లుబ్ధుల, దొంకిన
వంచింపకు శత్రునైన పగతో సాధ్వీ! 83

కం. ఇలలో నందఱు బంధులె!
యల కష్టసుఖంబులందు యలయక వెంటన్
గలసియు వర్తించు నతఁడె
వెలయును బాంధవు డనంగ వినుమా! సాధ్వీ! 84

కం. బ్రతికిన వెన్నాళ్లైనను
అతిగా పతిభక్తి యుంచి యా సర్వేశున్
మతిసేవించుచు నలరెడు
సతికే సుమ కీర్తి కొంద సాధ్యము సాధ్వీ! 85

కం. పెక్కురు పుత్రులఁ గన్నను
అక్కజమెంతయొ తనువున కమరియు నున్నన్
నిక్కము నాథునిఁ గొలువక
చిక్కదు యాముక్తి కాంత సిద్ధము సాధ్వీ! 86

కం. బ్రతికెడు నాలుగు దినములు
పతి చెంతను సేవఁ జేసిఁ బరగక యున్నన్
అతిజాణి యని యందురు
గతి శూన్యత గల్గురెంటఁ గనగా సాధ్వీ! 87

కం. కావున దేహము సతమని
దేవుఁడు నాథుండె యనుచుఁ దెలియక యున్నన్
బోవును సర్వ సుకర్మలు
కావు సుమీ, కీర్తిగల్గు కాంతవు సాధ్వీ! 88

కం. ధరణిన్ జన్మములందున
నరజన్మము గల్గుటరుదు నాతీ! గానన్
పరమును నిహమునుఁ బొందగ
వరునిన్ సేవించుమమ్మ వాంఛతో సాధ్వీ! 89

కం. కలిమియు లేమియుఁ గలుగుట
కలదందఱి కిలనుగాని కష్టములోనన్
వలపోయుచు సుఖముండిన
యిల విఱ్ఱబడగ దగదది యెన్నడు సాధ్వీ! 90

కం. కావున కొన్నిదినంబుల
కావల భోగముల రోసి జ్ఞానానందముల్
గావలె మోక్షము నొందగ
భూవలయమునందు యశము బొందగ సాధ్వీ!91

కం. శోణిత శుక్లమయంబై
క్షోణిని యీ తనువు వెలయు । తోయజనేత్రీ!
అణిగుండక, తనదేహము
మణిపూసని సంతసింప । మాన్యమ? సాధ్వీ! 92

కం. మర్మాంసంబనిఁ దెలిసియు
కర్మకు లోబడక యెపుడు । కడు జాగ్రతతో
మర్మము నెఱువక మెలగిన
నిర్మల మోక్షంబుగల్గు । నిజముగ సాధ్వీ! 93

కం. తానోనరించిన పూర్వపు
యేనోము ఫలంబుగలదో? । యెన్నగ నదియే
యీనాటికి వర్తించును
యేనాటికి తప్పదిటుల । నెఱుగుము సాధ్వీ! 94

కం. తనువిల శాశ్వత మవదిది
కనుఁగొనగను యేమిలేదు । కాంతా! గానన్
అనువుగఁ గర్మలఁ జిక్కక
వినుమా! మోక్షంపుబాట । విమలసుసాధ్వీ! 95

కం. పుట్టగ రా దీరూపము
గిట్టిన మరి వెంటపోదు గిరవై చుచుఁ దా
నెట్టినఁ దప్పువుఁ జేసిన
గట్టిగ నిజకర్మ లెపుడుఁ గాంచగ సాధ్వీ! 96

కం. కుచములు ఘనమై యున్నను
అచలంబగు నేత్రయుగము లతివెడదయినన్
కచభర మల్పంబై నను
అచిరంబే గాని తిరము లగునా! సాధ్వీ! 97

కం. ఎన్నిసుఖంబులుఁ గల్గినఁ
బన్నుగ ధరణీశు కిష్ట పత్నివియైనన్
కొన్నిదినంబులెఁగా నవి
యెన్నగ శాశ్వతములగునె? యెంచుముసాధ్వీ!

కం. జీవము వీడిన తనుపరి
రావిక నిను వెంబఁడించి రమ్యపుసౌరుల్
గావున యుసురులు యుండగ
సేవలు భర్తకు సలుపుట శ్రేయము సాధ్వీ! 99

కం. అందము తనువుకేఁ గానీఁ
బొందుగ యాత్మకును లేదుఁ బాలతీ వినుమా!
నందెడు బాల్యము ముదిమియు
చెందునె? యాత్మకును వీటి చెలుపులు సాధ్వీ! 100

కం. ఒక్కెడ జననం బందియుఁ
నొక్కనిఁ గల్యాణి వగుటఁ యోచింపంగన్
నికటము మును సంబంధము
అకటా తమున యత జెసీకు యాపుత్రు సాధ్వీ! 101

కం. దేవుని కెవ్వరు పగతురు
యేవనితకు కర్మకృతము యెట్టులొ యట్టుల్
కవఁజేయు పతినిఁ గావున
భువి నాతనిఁ గొలువ నీకుఁ బూజ్యత సాధ్వీ! 102

కం. పరమేశ్వరు చరణంబులు
పరి పరి పూజించి ముక్తి పథముఁ గనగా
పురుషులు యెటుఁ దపియింతురో!
ఆరీతిని ధవునిఁ గొలచి యలరుమ సాధ్వీ! 103

కం. కర్మా కర్మల జ్ఞానము
నిర్మలమతి నెఱిగినీవు నిశ్చలభక్తిన్
ధర్మపరాయణివయి పతి
నర్మిలిపూజించి యశము నందుమసాధ్వీ! 104

కం. తనువులు ధాత్రిని వేఱగుఁ
గనగా పరమాత్మ యొకఁడెఁ గావున నీవున్
అనయము భూతలమందున
విను సమదయఁబూనదగునువిధిగా సాధ్వీ! 105

కం. యోనులనేకములందునఁ
గానగ నీ వుద్భవించి గరిమంతో నిపుడున్
మానవ స్త్రీవైఁ బుడితివి
గనుమా!యికనైన ముక్తిగతులనుసాధ్వీ! 106

కం. సానగ గోత్రజుఁడ ధర
న్వీను నూకయ పౌత్రకుండ వీరన సుతుఁడన్
ఘన విశ్వబ్రాహ్మణ కుల
జనితుండను చాయమాంబజనని సుసాధ్వీ!107

కం. పరమేశ్వర భక్తుండై
వరలెడు శ్రీ ధర్మరావు వ్రాసెను పేర్మిన్
తెలివులు సతులకు నిచ్చును
చిరకాలముఁ గీర్తివలయ క్షితిలో సాధ్వీ! 108

సంపూర్ణము.



మాచే రచియింపబడి వెలకు దొరుకు

# గ్రంథములు

| | |
|---|---|
| జయంత జయపాల విజయము:—నాటకము | 0-8-0 |
| గరుడోపాఖ్యాన నాటక భజన కీర్తనలు:— | 0-8-0 |
| నిర్వికార శతకము:—భక్తిరస పూరితము | 0-6-0 |
| సతీ అనసూయ చరిత్ర:—హరికథ | 0-6-0 |
| మైరావణ చరిత్ర:— ,, | 0-6-0 |
| సాధ్వీనటనశతపద్యరత్నావళి:—చక్కనినీతి | 0-4-0 |
| ఇతడే నా ప్రాణ స్నేహిత రత్నము అను ఇంగ్లీషు కామిక్కు | 0-4-0 |
| చంద్రశేఖర స్తుతి పద్య రత్నావళి:— | 0-4-0 |
| మార్కండేయ దండకము:— భక్తులకు నిత్య పఠనీయము | 0-4-0 |
| చాటుధార మంజరి:— | 0-4-0 |
| నీలాపనిందాహరణము:—వినాయక చవితి కథ | 0-0-6 |
| కంచికామాక్షమ్మ దండకము:—విశ్వ బ్రాహ్మణులకు నిత్య పఠనీయము | 0-1-0 |

వలయువారు:— దేవాముల ధర్మారావు
కొమరిపాలెము, తూర్పు గోదావరిజిల్లా
(అని వ్రాయవలెను)